# BAALABRAHMAM



Kavishiromani
Prof. RAAVIKANTI VASUNANDAN

# బాలబ్రహ్మం



కవిశిరోమణి
ఆచార్య రావికంటి వసునందన్

# బాలబ్రహ్మం

(దీర్ఘకావ్యం)

కరారవిందేన పదారవిందం
ముఖారవిందే వినివేశయంతం
వటస్య పత్రస్య పుటే శయానం
బాలం ముకుందం మనసా స్మరామి.



కవిశిరోమణి
ఆచార్య రావికంటి వసునందన్

**Baalabrahmam**
by ***Kavishiromani***
**Prof. Raavikanti Vasunandan**

First Edition: **2008**



**Prof. Raavikanti Vasunandan**
Dr.B.R. Ambedkar Open University
Road No.46, Jubilee Hills, Hyderabad-33.
Cell: 9849852182

Price: **Rs.10/-**

*For Copies:*
**All Branches of Vishalandhra**



*Printed at:*
**Vipla Computer Services**
*(Designers & Multicolour Offset Printers)*
Nallakunta, Hyderabad - 500 044.
Ph.: 2765 4003, 2767 6910, 27677078

మా ముద్దుల మనుమడు
చిరంజీవి **రావికంటి శ్రీహర్ష**
జన్మదినోత్సవ సందర్భంగా
అనంతకోటి ఆశీస్సులతో . . .

**- వసునందన్**

# శైశవ జీవన వేదం



ఈ కవి పేరే వసునందన్. అంటే బాలకృష్ణుడు. ఇతడు సాహిత్యలీలా బాలుడుగా ఎదిగిన ధురంధరుడు. నాలుగు కథాకావ్యాలు, ఏడు దీర్ఘకావ్యాలు, మూడు గేయకావ్యాలు, తొమ్మిది వచనకవితా సంపుటులు, నాలుగు సాహితీ విమర్శ-పరిశోధన గ్రంథాలూ, ఇంకా ఏడు వివిధ కృతులు, ఇలా ఇన్నాళ్లూ అవలీలగా రాసివేసి ప్రతిష్ఠాత్మకమైన షోడశ పురస్కారాలు అందుకున్న సాహిత్య జగజ్జెట్టి. సంప్రదాయాన్ని, ఆధునికతను సమంగా సంతరించి సాహిత్యరథం నడుపుతున్న సారథి.

ఈ వసునందనుడు ఇప్పుడు తాత అయ్యాడు. 'మనుమ' సిద్ధితో శ్రీహర్ష పులకాంకితుడైన కవి **గుండెపొంగితే** వెలువడిందీ కావ్యం. **బాలబ్రహ్మం** అనడంలోనే-సృష్టిలోని శైశవ వైశిష్ట్యాన్ని సృజనాత్మకంగా ఆవిష్కృతం చేయడం స్పష్టమవుతోంది. స్వచ్ఛశైశవ హృదయం వున్న కవిగానీ బాలబ్రహ్మాన్ని దర్శించడం సాధ్యం కాదు.

ఈ కావ్యం శైశవాన్ని భిత్తికగా చేసుకుని, వ్యక్తి తాత్త్విక రసానుభూతిని బ్రహ్మానందమయం చేస్తుంది. **పిడికిళ్ల కొద్దీ రహస్యాలు, దోసిళ్లకొద్దీ తారంగాలు, ఆనందామృతగంగలు** తన రచనా విన్యాసంతో అందిస్తాడు కవి. రూప రస గంధ స్పర్శలనూ, పంచ భూతాత్మక ప్రపంచాన్నీ, సకలసృష్టి అందాలనూ - అన్నిటినీ పసివాడి ప్రతి కదలికలో దర్శించి, అక్షర రమ్యతతో అనుభూతిమయం చేయడం - పరిణత లేఖినికే సుసాధ్యం.

కొనసాగుతున్న వసునందన్ కవితాయాత్రలో **బాలబ్రహ్మం** ఒక తీర్థయాత్ర. **ప్రకృతి మనిషికిచ్చిన కోటికోటి పుణ్యఫలం పసితనం** అని అందుకే సంభావించ గలిగాడు. **చొంగకార్చే నోటిలో పచ్చి పసితనం గుబాళింపులు - ఎన్ని పుట్ల సుగంధ ద్రవ్యాలు సాటి?** అనగలిగాడు.

**పవ్వళిస్తే వటపత్రశాయి**
**పరవశిస్తే మహానందదాయి**
**కాళ్లు చేతులు కదిలిస్తే మత్స్యమూర్తి**
**పారాడితే శ్రీకూర్మం**
**ఆడుకుంటే ఆదివరాహం**

కూర్చుంటే లక్ష్మీనారసింహం
అడుగులు వేస్తే వామనావతారం
ఆగ్రహిస్తే పరశురామం
విద్యాబుద్ధుల శ్రీరామం
జ్ఞానానంద శ్రీకృష్ణం
బాలబ్రహ్మం

మొత్తం కావ్యసారాన్నీ, శైశవంలోనే - పుంజీభూతమై వున్న జీవనసారాన్నీ ఇలా ఆవిష్కరించగలగడం వసునందనుడికే చెల్లింది. **అమ్మ ఒడే మానవత గుడి - ఊగే ఉయ్యాలే ఆనందలోకాల జంపాల - తల్లి పయ్యెదమాటు దోబూచులే జగన్నాటకానికి** తెర తీసే ప్రయత్నాలు అని దశావతార ధర్మాన్ని మానవజీవనసారంగా ఆ జగన్నాటక సూత్రధారి **తదేక క్రీడా ధ్యాస జీవనవేద బాలబ్రహ్మశ్వాసగా** అభివ్యక్తీకరించడం, అభినందనీయం కాదామరి!

మొదటి సంవత్సరం - అంటే పన్నెండు నెలల కాలంలో ఎదిగే పసివాడి జీవన సరళిని - పన్నెండు చిరు అధ్యాయాలుగా పరిచి చెప్పిన ఈ రచన జీవనవేదనాదాన్నీ, బ్రతుకు తాత్త్వికసారాన్నీ ప్రతీకాత్మకం చేయగలగడం విశేషం. పసిచేష్టల్లోని ప్రత్యంశాన్ని 'పాజిటివ్‌థింకింగ్'లో చూసి, పిల్లల మంకుపట్టులో ప్రహ్లాదుని భక్తి 'పట్టు'ను, ధ్రువమార్కండేయుల 'ఆత్మబలాన్ని' సాక్షాత్కరింపచేయడం **మానవేతిహాసంలో** మరపురాని **వ్యక్తిత్వ చింతామణిగా** దర్శించడం సహేతుకమే.

**నిరంతర ప్రగతితో నిత్య సంతోషంతో**
**నిర్నిద్ర కాంతితో నిర్నిమేష మనీషతో**
**మహా యశస్సుతో మహిత మానవతా తపస్సుతో...**

శ్రీహర్ష ప్రతీకగా సువిశాల విశ్వవ్యాప్తంగా బాల్యం సుఖంగా వర్ధిల్లాలనే ఆచార్య రావికంటి వసునందన్ ఆశీర్వాద సదాశయమే - ఈ కావ్య ఫలశ్రుతి!

శుభాకాంక్షలతో...

సదా మీ
**సుధామ**
9849297958

25.09. 2008
హైదరాబాద్



# ఆంతర్యం

ఈ రచనకు ప్రేరణ - మా యింటి మణిదీపం, మా కంటి వెలుగు, చిన్నారి పొన్నారి మనుమడు చిరంజీవి రావికంటి శ్రీహర్ష. అతని అవ్యక్త మధుర మంజుల ధ్వనులు, శైశవలీలలు, బోసినవ్వులు- నాలో రసానంద సుధాబిందువులు వర్షించాయి. సరిసాటిలేని పులకరింతలు మొలిపించాయి. విశాల విశ్వ బాలబ్రహ్మ స్వరూపాన్ని సాక్షాత్కరింపజేశాయి. అందుకే అభినందన పూర్వకమైన అనంతకోటి ఆశీస్సులతో ఈ సత్కృతి - మా సుపుత్రుడు చిరంజీవి రావికంటి శిరీష్, మాకోడలు చిరంజీవి లక్ష్మీ సౌభాగ్యవతి, శ్రీమతి స్వప్నల ప్రథమ సంతానం చిరంజీవి శ్రీహర్షకు అంకితం.

దీనికి సముచితమైన పీఠికను ఆత్మీయంగా సమకూర్చిన ఆప్తమిత్రుడు ప్రముఖ రచయిత, విమర్శకుడు, మీడియా నిపుణుడు సుధామకు కృతజ్ఞతలు.

**- వసునందన్**



# కవిశిరోమణి
# ఆచార్య రావికంటి వసునందన్

జననం : 04.05.1949
జన్మస్థలం : కమాన్‌పూర్
కరీంనగర్ జిల్లా, ఆంధ్రప్రదేశ్
తల్లిదండ్రులు: కీ.శే. శ్రీమతి జగ్గమాంబ, శ్రీ కిష్టయ్య
విద్య : ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి
ఉద్యోగం : తెలుగు ప్రొఫెసర్,
డా. బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం
హైదరాబాదు.

## రచనలు

### కథా కావ్యాలు

రతీప్రద్యుమ్నము (గద్య కథాకావ్యం - 1971)

గురుకులము (విమర్శనాత్మక గద్య కథాకావ్యం - 1978)

భారతం (పద్య కథాకావ్యం - 1980 - డా॥ దేవులపల్లి కృష్ణశాస్త్రి స్మారకపురస్కారం పొందిన కృతి)

బలి (గేయ కథాకావ్యం - 1981)

### దీర్ఘ కావ్యాలు

త్రయి (1982)
మనస్సు (2004)
పిల్లలమఱ్ఱి (2006)
మట్టిముద్దలు (2007)
ఆయుధం కవిత్వం (2007)
ప్రవాహిని (2008)
బాలబ్రహ్మం (2008)



### గేయ కావ్యాలు

శ్రీరామ చరితామృతమ్ (పాటల్లో రామాయణం - 1992)
శ్రీవేంకటేశ్వర తారావళి (సంకీర్తనలు-2005)
ఎందరో మహానుభావులు (జీవిత చరిత్రలు - 2006)

### సాహితీ విమర్శ - పరిశోధన

భావదీపికలు (సాహిత్య వ్యాససంపుటి - 1980)
భూమిక - ఒక సమగ్ర పరిశీలనం (ఎం.ఫిల్. సిద్ధాంత వ్యాసం - 1985)
అష్టాక్షరి (సినారె కృతులపై సాహిత్య వ్యాసాలు - 1987)
ఆధునికాంధ్ర కవిత్వంలో మానవతావాదం - విశ్వంభర విలక్షణత (పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం - 1990)

### వచన కవితలు

సాధన (కవితా సంపుటి - 1981)
కలం కదిలితే... (కవితాసంపుటి - 2003)
మెరుపు మెరిస్తే... (కవితా సంపుటి-2004)
వాన కురిస్తే... (కవితా సంపుటి-2005)
నేల నవ్వితే... (కవితా సంపుటి-2006)
మనసు నిండితే... (కవితా సంపుటి-2006)
సింగిణీ మొలిస్తే... (కవితా సంపుటి-2006)
నెమలి ఆడితే... (కవితా సంపుటి-2008)
గుండె పొంగితే... (కవితా సంపుటి-2008)

### వివిధ కృతులు

వేణీ సంగమం (గేయం, పద్యం - 1975)
ప్రజావిజయం (రేడియోరూపకం - 1990)
ప్రయోజన దండకాలు (దండకాలు - 1993)
జైగణేశ్, బాలాజీ (భక్తిపాటల ఆడియో క్యాసెట్స్ - 1994)
లోవెలుగు (ముక్తకాలు - 2004)
రావికన్నులు (సంక్షిప్త కవితలు-2006)
బాలజ్యోతులు (పిల్లల కథలు-2007)

## అనువాదాలు

దౌడ్ (హిందీ అనువాదం) డా.ఎం.రంగయ్య (2006)
రెసొల్యూట్ మైండ్ (ఇంగ్లీష్ అనువాదం) డా.బి.రామచంద్రయ్య (2006)
విరాట్ ఏకతా వట్ (హిందీ అనువాదం) డా. ఎం. రంగయ్య (2008)

## ముద్రణలో

కృష్ణం కలయ... (పద్య కథాకావ్యం)
అష్టాక్షరి (పద్య కథాకావ్యం)
భక్తి (దీర్ఘ కావ్యం)
నారీమణులు (పిల్లల కథలు)
అడుగడుగునా! (సంక్షిప్త కవితలు)
గుండె పొంగితే...(కవితా సంపుటి)

## పురస్కారాలు

ఎ.పి.ఎ.యు.యస్. సమాఖ్య కడప స్వర్ణపతక పురస్కారం (1982)
డా. దేవులపల్లి కృష్ణశాస్త్రి స్మారక పురస్కారం, హైదరాబాద్ (1982)
శ్రీ జమిలి నమ్మాళ్వార్ స్మారక పురస్కారం, హైదరాబాద్ (1990)
శ్రీ తేరాల జగదీశ్వర్ స్మారక పురస్కారం, హైదరాబాద్ (1993)
శిల్పా ఆర్ట్ క్రియేషన్స్ ఉత్తమ విద్యావేత్త పురస్కృతి, హైదరాబాద్ (1993)
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉత్తమ అధ్యాపక పురస్కృతి, హైదరాబాద్ (2002)
డా. వానమామలై వరదాచార్య సాహిత్య పురస్కారం, కోరుట్ల (2003)
కవిశిరోమణి బిరుదప్రదానం - భారతీ సాహిత్య సమితి, కోరుట్ల (2003)
డా.జె.ఆర్.ఇ.టి.రజతోత్సవస్వర్ణపతక,స్వర్ణకంకణపురస్కారం,జగిత్యాల (2003)
వానమామలై జగన్నాథాచార్య సాహిత్య పురస్కారం, కరీంనగర్ (2004)
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉగాది పురస్కారం, హైదరాబాద్ (2004)
పొట్టిశ్రీరాములు తెలుగువిశ్వవిద్యాలయం ధర్మనిధిపురస్కారం, హైదరాబాద్ (2004)
ఆంధ్రప్రదేశ్ అధికార భాషాసంఘం - భాషావేత్త పురస్కారం, రంగారెడ్డి (2006)
శ్రీ దోమా వేంకటస్వామిగుప్త సాహిత్య పురస్కారం, కడప (2007)
తేజ ఆర్ట్ క్రియేషన్స్, సాహితీ పురస్కారం, హైదరాబాద్ (2007)
భారత పర్యావరణ పరిరక్షణ గవాక్షం - రంగారెడ్డి జిల్లా పురస్కృతి (2008)
తేజ ఆర్ట్ క్రియేషన్స్-ఆచార్య తిరుమల సాహితీ పురస్కారం, హైదరాబాద్ (2008)



## 1

మొగ్గ దొడిగిన సౌకుమార్యం
రెక్కవిచ్చిన శైశవం
బాల్యం.

దిక్కులు వికసించే వెన్నెలనవ్వు
లెక్కలేనన్ని భావాలు ఆరబోసే కదలికలు
పిడికిళ్లకొద్దీ రహస్యాలు
దోసిళ్లకొద్దీ తారంగాలు
ఆనందామృత గంగలు -
నోట దుమికే కాలిబొటనవ్రేలి కొనలు
వటపత్రశాయి రక్షగా
మూతి విరిసిన శైశవం సాక్షిగా.

పాకులాటలు ఎదుగుదలకు
పడిలేవటాలు పరుగు పందాలకు
పదగెత్తి ఆడే శైశవ బ్రాహ్మ్యం
చిలుక పలుకుల సంగీత స్వర సరస్వతికి
స్వాగతం.

## 2

చేజారిన వేసవేల మాధుర్యలోకాలు
ముద్దుల మూటకట్టి ఇచ్చే
సరిసాటిలేని పులకరింతలు
శైశవలీల పలకరింతలు.

చొంగకార్చే నోటిలో
పచ్చి పసితనం గుబాళింపులు –
ఎన్ని పుట్ల సుగంధద్రవ్యాలు సాటి?
ఎన్నికోట్ల పారిజాత ప్రసవసౌరభాలు పోటి?

బోసినవ్వులు అమృతాభిషేకాలు
దొంగఏడుపులు జగన్నాటక విలాసాలు
కోపతాపాలు సరసలీలా విన్యాసాలు.

కాలెత్తి తన్నితే పూలు పోసినట్టు
చేయెత్తి తడిమితే కోటివరాలు కురిసినట్టు
ఆడించే కాళ్లు చేతులు
నాట్యవేదానికి నిత్యనూతన వ్యాఖ్యానాలు
నిరంతర హావభావ రత్నరాశులు ఎత్తిపోసే పెన్నిధులు
కడగంటి చూపులు.
దొరికిందల్లా నోటకుక్కుకునే ప్రయత్నమే
పుట్టిందే పొట్టకోసమని
తనదైన అనుభవానికని.



ఎన్ని భువనాల ఆధిపత్యం సరిసమానం?
మనసారా పసితనాన్ని హత్తుకుంటే,
ఎన్ని వాగ్వైభవాలు ఆగుతాయి?
మాటలు రాకున్నా,
ఎన్ని సరిగమలు తులతూగుతాయి?
తొస్సి పలుకుల మాధుర్యాలకు.

మహిలో నహిప్రతి శైశవానికి
ప్రకృతి మనిషికిచ్చిన కోటికోటి పుణ్యఫలం
పసితనం.

అవని చివరలకు పరుగులు తీయాలని
ఆకాశం అంచులు అందుకోవాలని
నాలుగుకాళ్లూ లేపి ఉరికే లేగదూడ మనస్తత్వం
బాల్య బ్రహ్మం.

## 3

చిరునవ్వుల చిలకరింపులే
ఏమాత్రం చేయి చూచినా
అన్నెం పున్నెం తెలియని చిన్నారి వెన్నెల నోటితో
అందరినీ ఆదరించే పరమాత్మ పలకరింపులా.

పట్టించుకోకపోయినా పట్టుదలగా
కేకలజోరు
లెక్కలేనన్ని చీకూ చింతలు తరిమికొట్టే
ఉక్కా ఉంగల తీరు.

ఏమాత్రం ముఖం తిప్పుకున్నా
ఏడుపై దూకే అలక
వన్నెల చిన్నెల బంగారు చిలుక.

అలవోకగా చూచినా అరనవ్వినా
ప్రతినిత్య దివ్యదీపావళి వేడుక
నిదురించినా మేల్కొంచినా మహాభోగి
శ్రీహర్ష సామ్రాజ్య చక్రవర్తి.

పవ్వళిస్తే వటపత్ర శాయి
పరవశిస్తే మహానంద దాయి
కాళ్లు చేతులు కదిలిస్తే మత్స్యమూర్తి
పారాడితే శ్రీకూర్మం
ఆడుకుంటే ఆదివరాహం



కూర్చుంటే లక్ష్మీనారసింహం
అడుగులు వేస్తే వామనావతారం
ఆగ్రహిస్తే పరశురామం
విద్యాబుద్ధుల శ్రీరామం
జ్ఞానానంద శ్రీకృష్ణం
బాల బ్రహ్మం.

## 4

అనుకరణ ప్రధానం శైశవం బాల్యం
భాషకే కాదు భావాలకూ
చేష్టలకే కాదు చేతలకూ
ఏమంటే అది ఏది చేస్తే అది
బింబ ప్రతిబింబ సూత్రంతో.

ఉక్కలో ఉంగలో ఊంలో
ఓంకార వేదస్వరాలు
కొత్త బాలవ్యాకరణ విన్యాసాలు
అక్షర వ్యత్యస్త ధ్వనిక్రమంలో –
'శ్రీ' కి చీ, 'రా' కు లా, 'కా' కు తా
విసిగించని విచిత్ర శబ్దాలు
ఎంత మరగినా తరగని బ్రహ్మానంద భాష్యాలు.

అందరాని చందమామను
అద్దంలోనైనా సరే అదిమిపట్టి ఆడుకోవాలనే
మనోభిరామం
ఆవులింతలోనే అఖిలలోకాలూ పొదవుకోవాలనే
లీలా గోపాలం.

అమ్మ ఒడే మానవత గుడి
ఊగే ఉయ్యాలే ఆనందలోకాల జంపాల
తల్లి పయ్యెద మాటు దోబూచులే
జగన్నాటకానికి తెరతీసే ప్రయత్నాలు.



## 5

నాలుగు దిక్కుల నడిమి భూగోళంలా
ఉయ్యేలలో గిరగిరా తిరిగే చక్రం
ఏడుపు శంఖ నినాదంతో బాలబ్రహ్మ
ఎత్తికొట్టే శిరఃకౌమోదకి
ధనుస్సులా వంగే వపుస్సు
మనోవేదనలనూ మానసిక వికారాలనూ
కత్తిలా కోసే తేజస్సు
కాళ్లు చేతులు తొడుక్కున్న పంచేంద్రియాలు
దశదిశలనూ దోషరహితం చేసే పంచాయుధాలు.

## 6

శైశవం ఉషోదయం
బాల్యం అరుణోదయం
తదేక క్రీడా ధ్యాస
జీవనవేద బాలబ్రహ్మ శ్వాస.

మోరలెత్తి ప్రభాతకిరణాల విందారగించే తామరబాలికలు,
అలలు చీల్చుకొని అంబరానికెగిరే మీనుబిల్లలు,
పూల గద్దెలమీద బారులు బారులుగా
సింగిణీ వన్నెలతో పోటీలకు అర్రులు చాచే
చిట్టి సీతాకోక చిలుకలు,
ఆడింది ఆటగా అంతరాన ఆడే తూనీగ కూనలు,
నితాంత వసంత శోభలకు తలలూచే చివురుటాకులు,
మంచులో తడిసి అరవిరిసిన విరజాజి పూల బాలలు,
పైరగాలితో కిచకిచలాడే పిల్ల పిట్టలు,
అడవిగాయనీయకుండా వెన్నెలను
అందాల ఆల్చిప్పల కన్నులనిండా పట్టితాగే
హరిణశాబకాలు
ఏది కనపడినా ఏది కదలినా ఏది మెదలినా
అదే పనిగా పట్టిపట్టి చూచే పరీక్షిత్తులు
అంతటా బాలబ్రహ్మ స్వరూపాలు.



## 7

ఆనందసందోహంలో అగ్రసరం బ్రహ్మానందం
బ్రహ్మానంద సహోదరం బాలానందం
చిన్న పలకరింపుకే నవ్వువెన్నెల వానజల్లు
ఏకొంచెం చేరదీసినా అంతులేని ఆత్మీయత
ఒక్క ఆటబొమ్మకే లెక్కలేనంత అనుగ్రహం
మచ్చలేని స్వచ్ఛమైన మమతానుబంధం
బాలబ్రహ్మానందానురాగ కందం.

ఏదిసాటి కల్లలెరుగని, మెరమెచ్చులు లేని
మాయమర్మాలు సోకని బాలానందానికి?

ముంగిట్లో ముగ్గు చూసినా
అంగట్లో హంగు చూసినా
నింగి చల్లే రంగు చూసినా
పొంగి పొరలిపోయే సహజానందం.

నచ్చిన మనిషి కనపడితే పిట్టలా
రివ్వన వాలిపోయే పట్టపగ్గాల్లేని పారవశ్యం
గోరంత ఆదరణకు కొండంత ప్రతిఫలం.

## 8

ఉడుముపట్టు బాలపట్టు
బడికిపోనని భీష్మిస్తే
పోనంటే పోను - ఎవ్వరేం చేసినా
అన్నం వద్దన్నా అంతే!
అష్టకష్టాలు.

ఈ మంకుపట్టులో ఉదయించిన బాలకిశోరాలే
ప్రహ్లాదుడు ధ్రువుడు మార్కండేయుడు
ఒక్కరొక్కరూ ఒక్కొక్క దివ్యరత్నం
మానవేతిహాసంలో మరపురాని
వ్యక్తిత్వ చింతామణి.



## 9

భువన నివహాలన్నీ నవపుండరీకదళనయనుని
వైభవాస్పదాలని నెరనమ్మి
కనిపెంచిన జనకుని
కఠిన శాసనాన్ని కూడా అధఃకరించిన
ప్రజ్ఞానిధి ప్రహ్లాదుడు
పరమ భక్తగణవరేణ్యుడు
ముక్కుపచ్చలారని ముద్దుబాల్యమెక్కడ?
వాసవాది నిర్జరేంద్రుల పీచమడచిన
వరహిరణ్యకశ్యప ధిక్కారమెక్కడ?
ఆత్మబలమే బలం
చెక్కుచెదరని పసితనపు మంకుపట్టే కారణం.

## 10

తండ్రి తొడ కాకపోతే
లోకాలన్నిటి తండ్రి అంకపీఠమే అధివసిస్తానని
బాలవాక్కు బ్రహ్మవాక్కుగా
ఘోరారణ్య సీమలకు తరలి
భీకర వన్యప్రాణుల కేకలకు బెదరక
కేవల శ్రీమన్నారాయణ తపోధ్యాన పరాయణుడై
స్థిరమై, సకలదిశాకోణ నియంత్రణమై
సర్వదేవతారాధ్యమైన ధ్రువనక్షత్ర పదాన్ని
శ్రీహరి కుడితొడ మీది సుస్థిర స్థానాన్ని పొందిన
ధ్రువుడు - నిశ్చల ప్రతిజ్ఞా ధురంధరుడు
మంకుపట్టుకు మరో ఉదాహరణ.



## 11

తమకు కనపడినంతనే
సకలప్రాణులు గుండెలు పగిలి చావవలసిన
భయంకర కాలయముని దంష్ట్రాకరాళ స్వరూపాన్నీ
ప్రళయకాల భీషణాగ్ని జ్వాలాసదృశ కాలపాశాన్నీ
తన అచంచల పారమేశ్వర జపనిష్ఠా మహిమతో
పట్టినపట్టు విడువక శివలింగాన్ని చుట్టుకున్న గరిమతో
త్రిప్పికొట్టిన మార్కండేయుడు -
కాలగతినే మార్చివేసిన మహనీయుడు
అవక్ర విధిక్రమాన్నే మరలించిన చిరంజీవి
అనల్ప బాలబ్రహ్మ సంకల్పానికి ఆదర్శ నిదర్శనప్రాయుడు.

## 12

గుణిస్తున్నాను
అఖండకాలంలోని అత్యద్భుత బాల్య క్షణాలను
అందరాని తొలినాటి
ఆనందలోకాల అనంత సంపన్నదిగంచలాలను.

ఇది - ఒక ఏడాదికి
పన్నెండు కవితల ప్రసూన మాలిక
అరుదైన బాల్యం అమృతఘడియల కూడిక;
అమోఘ కాల కక్ష్యకు ఆవంత వైదొలగినా
భావనలకే తప్ప జీవనాలకు
ఎంత తపించినా అందని వేడుక.

బొట్లుబొట్లుగా పసితనం పీయూషం
పొరలుపొరలుగా అమందానంద సందోహం
అవనీతలంనిండా బాలలకు
అనాహతంగా అనుభవైకవేద్యం కావాలని.

విశాలవిశ్వం-
అనంతకోటిదళ బాలబ్రహ్మ ప్రసవాసనమై వికసించాలని
నిరంతర ప్రగతితో నిత్య సంతోషంతో
నిర్నిద్ర కాంతితో నిర్నిమేష మనీషతో
మహా యశస్సుతో మహిత మానవతా తపస్సుతో...